# తిరుమలేశ శతకము

రచయిత:
జక్కంపూడి మునస్వామి నాయుడు

ప్రచురణ:
దేదీప్య ప్రచురణలు
తిరుపతి

# TIRUMALESA SATAKAMU

*by*

**Jakkampudi Munaswamy Naidu**

Year of Publication : 1997

Copies : 1000

Price : Rs. 5/-

This book is Published with the Financial Assistance of

**TIRUMALA TIRUPATI DEVASTHANAMS**

Under their scheme
"Aid to Publish Religious Books"

Published by :
**Dedeepya Prachuranalu**
No. 71, L. S. Nagar,
Thirupati.

Printed at :
Lakshmi Graphics.
48-B, Ramanuja Iyer Street,
Chennai-600 021.



తే.గీ. గ్రంథకర్త యశంబును కలుగజేయ
శతకము రచింప జేసిన సదయహృదయ
దీని నీకె అంకితమిత్తు తిరుమలేశ
స్వీకరించుము దయ చేసి శ్రీనివాస.

# కృ త జ్ఞ త లు

ఆర్థిక సహాయంతో ఆదుకొని ఈ శతక ముద్రణకు దోహదం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నా హార్థిక నమస్సుమాంజలులు.

శతక రచనా సంకల్పాన్ని ప్రోత్సహించి, శ్రీ వేంకటేశ్వర స్వామికి అంకితంగా రాయమని సూచించిన ఆత్మీయులు డా॥ మన్నవ భాస్కర్ నాయుడుగారికి, శతక రచనలో మెలకువలు సూచించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ కళాశాల పూర్వాధ్యక్షులు ఆచార్య పి. వి. అరుణాచలంగారికి, మకుటాన్ని సూచించడమేగాక శతకానికి తుదిమెరుగులు సంతరించిపెట్టిన పెద్దలు, మాన్యులు శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యుల వారికి, తమ సహృదయతతో, సలహాలతో ఈ శతక రచనను ఎప్పటికప్పుడు ప్రోత్సహించడమేగాక పనిభారాన్ని కూడా పక్కనబెట్టి కోరగానే 'నివేదన' వ్రాసి ఇచ్చిన చిరకాల మిత్రులు, శ్రేయోభిలాషి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనాలు.

తగు సూచనలతో శతక ప్రచురణకు ప్రోత్సహించడమేగాక 'అభినందన' వ్రాసి ఇచ్చిన మిత్రులు చిరంజీవి కోరాడ రామకృష్ణగారికి కృతజ్ఞతలు.

శుద్ధప్రతిని తయారుచేసి ఇచ్చిన చిరంజీవులు డా॥ డి. నల్లన్న, బి. శ్రీధర్, కుమారి డబ్ల్యు. యం. సీతాలక్ష్మి, శ్రీమతి జె. కల్పనలకు ఆశీఃపూర్వక ధన్యవాదాలు.

సకాలంలో చక్కగా ముద్రించి ఇచ్చిన చెన్నై, చాకలిపేట, లక్ష్మీగ్రాఫిక్స్, యజమాని శ్రీ జి. వీరబ్రహ్మంగారికి, వారి సిబ్బందికి హార్థిక ధన్యవాధాలు.

జక్కంపూడి మునస్వామి నాయుడు.

# నివేదన

ఆంధ్ర సారస్వతంలో శతకవాఙ్మయం మిక్కిలి విస్తృతంగా అభివృద్ధి పొందింది. భక్తిప్రధానమైన శతకాలు కోకొల్లలుగా వివిధ దేవతలపై రచింపబడ్డాయి. చాలామంది కవులు తమ రచనలను దేవతాస్తుతులతోనే ప్రారంభిస్తారు. అందువల్ల శతకాల సంఖ్య బాగా పెరిగిపోయింది.

భక్తిభావం తరువాత నీతిప్రధానమైన శతకాలు ప్రాదాన్యం పొందాయి. సుమతి శతకం వంటి శతకాలు నీతిబోధనకే వెలువడ్డాయి. శతక రచనలు వివిధ వృత్తాలలో సాగాయి.

"దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ!" అన్న మకుటంతో తేటగీతలలో సాగిన ఈ శతకం భక్తిభావభరితమైనది. ఎడ నెడా నీతులు కూడా ఇందులో కనిపిస్తున్నాయి.

పాపకర్మలు చేయుట పాడిగాదు
పుణ్యకర్మలు చేయుట భువిని మేలు
మంచి చెడులు విచారించి మనగవలయు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! (56)

అన్న పద్యంలోని నీతి స్పష్టమే.

ఇది తిరుమల దేవుణ్ణి ఉద్దేశించి సాగిన శతకం కాబట్టి ఇందులో శ్రీ వేంకటేశ్వర స్వామి చరిత్రను నిర్దేశించే పద్యాలు కూడా ఉన్నాయి. 11 వ పద్యం నుండి 16 వ పద్యం వరకూ ఈ విశేషాలు చూడవచ్చు.

21 వ పద్యం నుండి 31 వ పద్యం వరకు 11 పద్యాలలో దశావతారాల ప్రస్తావన ఉన్నది. ఇతరత్ర కూడా అవతార మూర్తుల దివ్యకృత్యాలు కీర్తింప బడ్డాయి.

ఈ శతక రచయిత శ్రీ మునస్వామిగారు నాకు చిరకాలం నుండీ పరిచితులు, వారిది సహజ కవిత్వము. పురాణాలతో వారికి గాఢ పరిచయం ఉన్నది!

వార్ధక్యంలో శ్రీ మునస్వామిగారు శ్రీ వేంకటేశ్వరస్వామి మీద ఈ శతకం వ్రాసి కృతకృత్యులయ్యారు. ఈ శతక ముద్రణకు తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆర్థికసహాయం చేయడం అభినందనీయం.

ఒక మంచిపని చేసి తమ రచనా కౌశలాన్ని భగవదంకితం కావించి ధన్యులైన శ్రీ మునస్వామిగారిని మనసారా అభినందిస్తున్నాను. సరళ సుందరమైన ఈ శతకాన్ని భక్తులు ఆదరిస్తారని విశ్వసిస్తున్నాను.

సముద్రాల లక్ష్మయ్య
తిరుపతి
5-8-97.

# అభినందన

తెలుగు శతకాలు కవులకు నడకలు నేర్పాయి. పాఠకులకు బ్రతుకురీతులు నేర్పాయి. అందుకే శతకాలంటే అందరికీ అంత ఆదరణ.

ఇంతటి విశిష్టమైన శతక ప్రక్రియ చేయూతగా సాహితీ క్షేత్రంలో అడుగుపెట్టిన శ్రీయుతులు జక్కంపూడి మునస్వామి నాయుడుగారు అభినందనీయులు. వీరు పాఠశాలకు వెళ్ళి విద్య నభ్యసించకపోయినా స్వయంకృషితో విద్యాభ్యాసం కొనసాగించారు. ఛందస్సు నేర్చుకొన్నారు. అందంగా పద్యాలు అల్లడం అలవాటు చేసుకొన్నారు. అప్పుడప్పుడు అడపాదడపా పద్యాలు అల్లడం అలవాటే కాని గ్రంథరూపంలో రావడం ఇదే ప్రథమం.

మీ చేతుల్లో ఉన్న ఈ తిరుమలేశ శతకంలో 116 పద్యాలున్నాయి. అన్నీ తేటగీతి పద్యాలే. ఈ శతకమంతా 'దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ!' అనే మకుటంతో సాగింది.

ఈ శతకంలో కవి ఆత్మనివేదన ఉంది. ప్రపంచ ప్రవర్తనా తీరుతెన్నులపట్ల వేదన ఉంది. భక్తి ఉంది. భగవదనురక్తి ఉంది. విశ్వవిరక్తి ఉంది. అక్కడక్కడ వేదాంత విషయాలు కూడా ఉన్నాయి. మానవులు మనుగడలో వినవచ్చే అపశ్రుతుల పట్ల కవికి కోపం ఉంది. తాపం ఉంది. అనుతాపం ఉంది.

అణకువకు బదులు అహంకారము అధికృత వహించడంతో అన్నిచోట్లా అలజడి నెలకొంది. దీనికి స్పందించిన కవి హృదయంనుంచి వెలువడిన పద్యం ఎంత హృద్యంగా ఉందో గమనించండి.

పెద్దపిన్నల నెంచు వివేకమేది?
న్యాయమన్యాయము నెరింగి నడచువేది?
బాపురే! మాయలోక మపాయమయము
దివ్య వ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ!

ఇలాగే శతకంలోని చాలా పద్యాలు కవి అనుభూతిని, స్పందనను యథోచితంగా ఆవిష్కరించడం గమనించవచ్చు. అశేషాంధ్ర లోకం ఈ శతకాన్ని ఆదరించి తద్వారా కవిని ప్రోత్సహించ గలదని ఆశిస్తాను.

కోరాడ రామకృష్ణ.
తిరుపతి
5-9-87.

# చిత్తగింపు

లక్ష్యం లేని జీవితం వ్యర్థం. జీవితం లేని లక్ష్యం నిరర్థకం. ప్రతివారికీ లక్ష్యం ఉండాలి. ప్రతిక్షణాన్నీ లక్ష్యసాధనకు వినియోగించాలి. అప్పుడే మానవత సార్థకం. మనుగడ అర్థవంతం.

లక్ష్యాన్ని ఏర్పరచుకొని దానికేసి పురోగమించే మహత్తరశక్తి మానవుడికి మాత్రమే ఉంది. తక్కిన ప్రాణికోట్లకు ఈ శక్తి ఉండే అవకాశం లేదు. మానవుణ్ణి తక్కిన ప్రాణికోట్ల నుంచి వేరుచేసే అంశాల్లో ఇది కూడా ఒకటి. ఈ శక్తిని వినియోగించకపోతే మానవుడు తక్కిన ప్రాణికోట్ల సమానస్థాయికి, కాదు కాదు; అంతకంటే తక్కువ స్థాయికి చెందిన వాడవుతాడు. కాబట్టి మానవ స్థాయిలో మనుగడ సాగించాలనుకుంటే మానవుడికి మాత్రమే అదనంగా సంక్రమించిన ఈ శక్తిని, అంటే లక్ష్యాన్ని వినియోగించుకోవలసి ఉంటుంది.

లక్ష్యం రెండు విధాలు. స్వల్పం, మహోంతం, స్వల్పకాలికం, దీర్ఘకాలికం, అనిత్యసుఖప్రదం, నిత్యసుఖసందాయకం, తాత్కాలిక సంతోషకరం, శాశ్వత సంతోషప్రదం, ప్రాపంచికం, పారమార్థికం.

కూడు, గుడ్డ, గూడు వస్తువాహనాదీ ఇతర భోగ్యపదార్థాలు మొదటి కోవకు చేరుతాయి. భగవదనుభూతిని పొంది, భగవదైక్యం పొందడం రెండవ కోవలోకి వస్తుంది. మొదటి లక్ష్యం కంటే రెండవ లక్ష్యం గొప్పది. తెలివైన వాడు తక్కువదానికంటే ఎక్కువదాన్ని పొందడంపట్లే ఎక్కువ ఆసక్తిని కనబరుస్తాడు. శ్రద్ధ వహిస్తాడు. ఈ కారణం వల్లనే మన పూర్వ ఋషులంతా పారమార్థిక చింతనలో పడి జీవితాలను పండించుకున్నారు. ప్రాపంచిక పదార్థాల పట్ల వైరాగ్యభావం వహించి వాస్తవాన్ని గుర్తించారు.

భర్తృహరి శ్లోక మొకటి ప్రపంచ వస్తువులు ఎంతటి భయావహాలో, వైరాగ్య మెంతటి అభయప్రదమో విస్పష్టం చేస్తుంది.

"భోగే రోగభయం, కులే చ్యుతిభయం, విత్తే నృపాలాద్భయం
మానే దైన్యభయం, బలేరిపుభయం, రూపేజరాయాభయం
శాస్త్రే వాదభయం, గుణేఖలభయం, కాయేకృతాన్తాద్భయం
సర్వం వస్తు భయాన్వితం భువినృణాం, వైరాగ్యమేవా భయం"

(భర్తృహరి సుభాషితం
—వైరాగ్య శతకం—శ్లోకం-31)

పై శ్లోకాన్నిబట్టి ప్రాపంచిక వస్తువులన్నీ అశాశ్వతాలని, భయావహాలని తేటతెల్లమవుతూ ఉంది. కాబట్టి వాటిమీది అనురక్తిని శాశ్వతమూ, అభయ ప్రదమూ అయిన పదార్థం మీదికి మార్చుకోవలసి ఉంది. అలాంటి పదార్థం శాశ్వత సుఖసంతోషదాయకం, నిరంతరానంద నిర్వికల్పానందప్రదాయకం, అయినా బ్రహ్మమే, లేదా దైవమే అని అభిజ్ఞుల అభిప్రాయం. కాబట్టి దైవాన్ని పొందడమే లక్ష్యంగా పెట్టుకొని పురోగమించడం సర్వులకూ సముచితం' సమాచరణీయం.

దైవాన్ని పొందేందుకు అనేక మార్గాలున్నాయి. వాటిలో కొన్నిటినీ భాగవతం ప్రవచిస్తుంది.

"కామోత్కంఠత గోపికల్, భయమునన్ గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్య నృపతుల్, సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు, భక్తినేమునిదె చక్రింగంటి, మెట్టైనను
ద్దామధ్యాన గరిష్ఠుడైన హరిజెందన్ వచ్చు ధాత్రీశ్వరా!"

(పోతన, బమ్మెర, శ్రీ మదాంధ్ర భాగవతము
—సప్తమస్కంధం—పద్యం-18)

ఉద్దామధ్యాన గరిష్ఠత భక్తివల్లనే సాధ్యం,

నిరవధిక, అనంత, అనవద్యకళ్యాణగుణ సంపన్నుడనే జ్ఞానంతో తనపట్ల గాని, తనవారిపట్లగాని చివరికి సమస్త వస్తువులపట్లా తనకుండే ప్రీతికంటే అధికమైన ప్రీతితో వేలకొలది అంతరాయాలు వచ్చినా పట్టువదలకుండా నిరం

తరము భగవంతునిపట్ల తన ప్రేమను ప్రవహింపజేయడమే భక్తి అని భగవద్రామానుజులు భక్తి కిచ్చిన భాష్యం. ఒకరకంగా చెప్పాలంటే ఎంతో ఆర్ద్రితతో అనిర్వచనీయమైన ప్రేమతో పలురకాలుగా భగవంతునితో నెలకొల్పుకొనే సత్సంబంధమే భక్తి.

భక్తిని అనేకులు అనేక అంశాలను దృష్టిలో ఉంచుకొని వర్గీకరించారు· సత్త్వ రజస్తమో గుణభేదాలను బట్టిగాని, ఆర్త, జిజ్ఞాస, అర్థార్థి అని మనస్తత్వ భేదాలనుబట్టిగాని, భక్తిని మూడు విధాలుగా విభజించవచ్చునని పెద్దలు పేర్కొన్నారు. పంచవిధ భక్తులను గురించి విజ్ఞాన-సర్వస్వం వివరిస్తుంది. ఇవి 1) శాంత భక్తి 2) దాస్యభక్తి 3) సఖ్యభక్తి 4) వాత్సల్యభక్తి 5) మధురభక్తి. శాంత భక్తికి – మహర్షులను, దాస్యభక్తికి – హనుమంతాదులను, సఖ్యభక్తికి – అర్జున కుచేలాదులను, వాత్సల్యభక్తికి – శబరి, యశోదాదులను, మధురభక్తికి–గోదాదేవి· మీరాబాయి, రాధాదులను ఉదాహరణాలుగా పేర్కొనవచ్చు.

అన్నమయ్య కూడా తన అమృతమయ సంకీర్తనలో నానావిధ భక్తులనూ పేర్కొన్నాడు.

"నానాభక్తులివి నరుల మార్గములు
మే నెపానన్నైనా నాతడియ్యకొను భక్తి

హరికిగా వాదించుటది ఉన్మాదభక్తి
పరులఁ గొలువకుంటే పతివ్రతాభక్తి
అరసి యాత్మఁ గనుటదియే విజ్ఞాన భక్తి
అరమరచి చొక్కుటే ఆనందభక్తి

అతిసాహసాల పూజ అది రాక్షసభక్తి
అతని దాసుల సేవే అదియే తురీయభక్తి
క్షితి నొకపని గోరి చేసుటే తామసభక్తి
అతని గతిని వుండుటది వైరాగ్యభక్తి

అట్టి స్వతంత్రుడౌటే అది రాజసభక్తి
నెట్టన శరణనుటే నిర్మల భక్తి
గట్టిగా శ్రీ వేంకటేశు కైంకర్యమే సేసి
తట్టు ముట్టు లేనిదే తగ నిజభక్తి"

నారదుడు పదకొండు విధాల భక్తిని ప్రతిపాదించాడు. గుణ మహాత్మాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, కాంతాసక్తి వాత్సల్యాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తి, పరమవిరహాసక్తి.

'రూప కథాప్యేతే దశదాభవతి'

ప్రహ్లాదుడు నవవిధ భక్తులను పేర్కొన్నాడు.
(నారదుడు—నారదభక్తిసూత్రాలు. సూత్రం-82.)

"శ్రవణం కీర్తనం విష్ణో స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్"

(వేదవ్యాసుడు
—శ్రీమద్భాగవతము 7-5-23)

ప్రహ్లాదుడు ప్రతిపాదించిన నవవిధ భక్తులలో కీర్తనకు అనంత కీర్తి ఉంది. విశిష్టత ఉంది. కీర్తించడం అంటే పొగడడం, కొనియాడడం, వినుతించడం అని చెప్పుకోవచ్చు. భగవత్కీర్తిని గానం చెయ్యడమే కీర్తన భక్తి ప్రధాన లక్షణం. భగవంతుని కీర్తిని పెంచే అతని లీలలను కొనియాడడం ఈ పద్ధతిలో ముఖ్యమైన అంశం. కీర్తనాభక్తి విశిష్టతను భాగవతం పలునోళ్ళ చాటింది.

"చక్రి పద్యంబులఁ జదువని జిహ్వలు
గప్పల జిహ్వలుఁ గౌరవేంద్ర"

(బమ్మెర పోతన-శ్రీమదాంధ్ర భాగవతం
—ద్వితీయ స్కంధం—పద్యం-150)

"ఘన విపద్గాఢాంధ కారంబు లడగునే
పద్మాక్షనుతి రవి ప్రభలు లేక"

(బమ్మెర పోతన-శ్రీమదాంధ్ర భాగవతం
—ద్వితీయస్కంధం—పద్యం-171)

"వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక"

(బమ్మెర పోతన-శ్రీమదాంధ్ర భాగవం
— ద్వితీయస్కంధం—పద్యం-170)

భగవత్కీర్తిని కొనియాడేందుకు అనేక పద్ధతులను అవలంబించడం పరిపాటి. కీర్తన, దండకం, ఉదాహరణం, స్తోత్రం, శతకం మొదలైన సాహితీ ప్రక్రియలు దీనికోసం వినియోగింపబడుతున్నాయి. కీర్తన—వాగ్గేయకారులకు, పదకవులకు మాత్రమే పరిమితమైతే, దండకం, స్తోత్రం, ఉదాహరణ—ప్రౌఢకవుల రచనలుగా ప్రజ్వరిల్లాయి. ఛందోజ్ఞానం, భాషాజ్ఞానం, సాహితీజ్ఞానం ఉన్న సామాన్యులు కూడా శతకరచనకు పూనుకొని భగవంతుని కీర్తించారు. తమ కీర్తిని నిలబెట్టుకున్నారు. అందువల్ల శతకం సర్వులకు సమాదరణీయమైన ప్రక్రియగా సమున్నతి కెక్కింది.

కావ్యరచనకు, కావ్యాధ్యయనానికి శతకాలే తొలిమెట్టు అంటే అతిశయోక్తి కాదు. అందువల్ల శతకానికి పద్యసాహిత్యంలో కీలకస్థానం ఉంది. సంస్కృత ప్రాకృత శతకాల్లోని సంఖ్యానియమం, మకుటనియమం, ఛందోనియమం, రస నియమం, ఆత్మాశ్రయ కవితాధర్మం అనేవి తెలుగు శతకాల్లోనూ చోటుచేసుకున్నాయని డా॥ కె. గోపాలకృష్ణారావుగారు శతకలక్షణాలను స్థూలంగా తెలియజేశారు. సామాన్యంగా శతకాల్లో నూటికి బదులు నూటయెనిమిది పద్యాలుండడం పరిపాటి. ఈ సంఖ్యానియమం భక్తిశతకాల్లో అధికంగా కనిపిస్తుంది. శతకాల్లో తర్వాత పేర్కొనదగింది మకుట నియమం. ప్రతిపద్యంలోనూ చివర మకుటం ఉంటుంది. ఇది సంబుద్ధ్యంతంగా ఉంటుంది. ఈ మకుటం ఆత్మాంకితంగానూ, అన్యాంకితం గానూ ఉండవచ్చు. భక్తి శతకాల్లో దైవాంకిత మకుటాలే ఎక్కువగా కనిపిస్తాయి. శతకరచనలో విధిగా పాటించవలసిన నియమాల్లో ఛందోనియమం కూడా ఒకటి. ఒక శతకంలోని పద్యాలన్నీ ఒకే ఛందస్సులోనే ఉండాలి. శతకకవి చంపకమాల తోనో, సీసంతోనో, కందంతోనో, ఆటవెలదితోనో, తేటగీతితోనో, లేక మరేదైనా ఛందస్సుతోనో కొనసాగించాలి. శతకపద్యాల్లో దేనికది సంపూర్ణంగా ఉంటుంది. కథాసూత్రానికి శతకాల్లో తావులేదు. కాబట్టి శతకాల్ని ముక్తకాలనీ

కూడా వ్యవహరిస్తారు. వస్త్వైక్యం లేకపోవడంవల్ల శతకాల్లో రసపోషణకు అవకాశముండదు. శతకాలు భావప్రధానంగా ఉంటాయి.

శతక వాఙ్మయంలో అనేక విభాగాలుగా కనిపిస్తున్నాయి. వేదాంత శతకాలు నీతిశతకాలు, అధిక్షేపశతకాలు, శృంగారశతకాలు, హాస్యశతకాలు. ప్రకీర్ణశతకాలు, వివిధ వస్తుశతకాలు, భక్తి శతకాలు,

భక్తి ప్రధానంగా వ్రాయబడే శతకాలు భక్తి శతకాలు, వీటిలో భక్తుని ఆర్తి ఉంటుంది. భగవన్నుతి ఉంటుంది. తన దోషాలు మన్నించి, ఆపదలను అంతంచేసి ఆదుకోమని భక్తిశతకకర్త భగవంతున్ని ప్రార్థిస్తాడు. తన మనసును ఆకర్షించిన దేవుడి గుణాల్ని, మహిమల్ని వేనోళ్ళ వినుతిస్తాడు. కవి తన హృదయాంతరాళాన్ని భగవంతునికి నివేదించే సంభాషణసరళే భక్తిశతకమంటే అతిశయోక్తి కాదు,

ఈ భక్తి శతకవాఙ్మయంలోనూ శైవ శతకాలు, వైష్ణవ శతకాలు. శాక్తేయ శతకాలు, తదితర దేవతల శతకాలు అని ఉపవిభాగాలుగా కూడా కనిపిస్తున్నాయి.

విష్ణుదేవుని అర్చామూర్తుల్లో వేంకటేశ్వరరూపం విస్వవిఖ్యాతం, కలుషాలను పరిమార్చి, కైవల్యం చేకూర్చే కన్నులపండుపు కలియుగ ప్రత్యక్షదైవం శ్రీ వేంకటేశ్వరుడు.

"వేంకటాద్రి సమంస్థానం—బ్రహ్మాండే నాస్తి కించనా
వేంకటేశ సమోదేవో—నభూతో న భవిష్యతి"

అని వైదికవాఙ్మయం ఘోషిస్తుంది. 'వినా వేంకటేశం ననాథో ననాథః' అని వైష్ణవుల దృఢవిశ్వాసం. భక్త సులభుడు, ఇహపర సందాయకుడు. ఏడుకొండల వాడు. స్మరణమాత్రం చేతనే పాపాలు హరించే ఆ పావనమూర్తిని స్మరించి తరించాలనే ఉద్దేశం తలెత్తింది. మీ చేతుల్లో ఉన్న ఈ శతకం రూపుదిద్దుకొంది. ఇందులో 116 పద్యాలున్నాయి. పద్యం గొప్పది కాదు. దాని మకుటం గొప్పది. భావం గొప్పది కాదు. భావజ జనకుని అనుగ్రహం గొప్పది. నా వేదనను ఆ వేల్పుకు నివేదించి బరువు దించుకొన్నాను.

ఛందస్సు నాదైనా, రచనాచందం స్వామిది. భావం నాదైనా, భావింపజేసిన ఘనత ఆ భక్తవత్సలుడిది. మాట నాది. కాని దాన్ని పలికించిన తీరుమాత్రం మధుసూదనుడిది. నేను నిమిత్తమాత్రుణ్ణి. ఆలోచిస్తే నాదేమీలేదు. నాచేత ఈ కైంకర్యం చేయించిన స్వామికి ధన్యవాదాలు తెల్పడం మాత్రమే నాపని. ఇందు లోని దోషాలు నావి. గుణాలు స్వామివి. ఈ శతకం చివరిదాకా చదివి ఇందులోని ఆలోచనల్లో పాలుపంచుకొమ్మని అశేషాంధ్రలోకాన్ని ఆహ్వానిస్తున్నాను.

ఇట్లు
బుధవిధేయుడు
జక్కంపూడి మునస్వామి నాయుడు,
తిరుపతి,

# తిరుమలేశ శతకము



తే॥ శ్రీరమా మనోమందిర ! చిద్విలాస !
భక్తజన పరిపాలక! భవ వినాశ!
కాంధళాకార! శరదిందు మందహాస!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 1

దూరదేశాల నుండియు తోష మెసగ
వేంకటేశ్వర! నిను జూడ వేడుక పడి
శేషగిరి జేరవత్తురు శిష్ట జనులు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 2

కొండపై నున్న నినుగాంచి కొలుచుకొరకు
మధుర గోవిందనామ సంస్మరణ తోడ
అధిగమింతురు శిఖరములార్ద్రమతిని
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 3

పాదాచారులై వచ్చి సద్భక్తిమీర
స్వామి పుష్కరిణీ జల స్నాతులగుచు
కోరికలు తీర గోవింద! కొలుతురు నిను
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 4

శ్రీ వరాహుని దర్శించి శ్రేయ మెసగ
నీదు సన్నిధికేతెంచి మోదమలర
ఇదె తరించితి మనుకొందు రెల్లవారు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 5

తే॥ నిన్ను దర్శించు కోర్కెతో నిఖిల జనులు
మహిత భవదీయ నామ సంస్మరణ తోడ
వరుసగా వచ్చుచుందురు వారిజాక్ష!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 6

దేహబాధల బోగొట్టు దిక్కు నీవె
మానసిక రోగములనెల్ల మాన్ప నీవె
పుట్టుకలు పుట్టు చెడగూల్చు పూజ్యుడీవె
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 7

అన్ని జన్మాలలోను వెన్నంటి వచ్చి
గాసి పరచు జరామృత్యు కష్టములను
కడకు బోద్రోలి కడితేర్చు ఘనుడ వీవె
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 8

పుత్రులుండిన గతులంద్రు పుడమి జనులు
సుతులు లేనట్టి వారికి గతులు లేవె?
తల్లిదండ్రుల హింసించు తనయుడేల?
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 9

దేవలోకము నందుండి దివిజ వరులు
వచ్చుచుందురు నిను జూడ వనజనేత్ర
ముక్తి గూర్తువు వారికి మోదమెసగ
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 10

తే॥ ఋషుల పంపున భృగమౌని సృష్టికెల్ల
అధికులైన త్రిమూర్తుల నరసి చూచి
సత్వపూర్ణుడ వీవని చాటి చెప్పె
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 11

మౌని నీయెద తన్నగా మండిపడుచు
భూతలంబున కేతెంచె మాతలక్ష్మి
మానవతులు సహింతురే మానహాని
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 12

నీవు భార్యా వియోగము నేపము కాగా
వచ్చితివి మానవుల గావ వసుధపైకి
ఆహా! ఎంతటి కారుణ్యమయ్య నీది
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 13

ఉన్నత స్థానమందున ఉండదలచి
ఆరు పర్వతములు దాటి అధికప్రీతి
వేంకటాచలమందున వెలసినావు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 14

పుడమి నాకాశ రాజాఖ్య భూభుజ సుత
పద్మవభన పద్మావతి భామను గని
మనసు పోగొట్టుకొన్నట్టి మాయయేమి
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 15

తే॥ వకుళమాలికతో నీదు వాంఛ చెప్పి
అతిరయంబున కన్నియ నడుగ బంచి
వెనుక ఎరుకల సానివై చనితి వీవు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 16

రాజదంపతులేకాక రాజ్యమందు
కల సమస్త జీవులు మెచ్చి కలసి రాగ
అతివ పద్మావతిని పెండ్లి యాడినావు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 17

పూతన కుచద్వయంబందు పూర్ణముగను
విషము నిడుకొని వచ్చి సంప్రీతి నేఁపి
పాల నీగ పీల్చితివట్టెల ప్రాణములను
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 18

రాతి నాతిగాఁ జేసిన రామచంద్ర
శిలలుగా మారుచున్న గుండెలనుఁ జూచి
ఎదలుగానైన మార్చవ దేమి సామి
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 19

పుత్రమోహమజామిళు బోదివికొనగ
సుతుని నారాయణా! యని చొక్కి పిలువ
మోక్ష మిచ్చితివటఁగదా! ముదము మీర
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 20

తే॥ పది విధంబుల రూపముల్ పరగదాల్చి
ధర్మ సంస్థాపనము జేయ ధరణియందు
అవతరించిన హితభావ! ఆదిదేవ!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 21

మత్స్యరూపము ధరియించి మహిమ మీర
సోమకాసురు వధియించి సురలు పొగడ
వేదములు బ్రహ్మ కిచ్చిన వేదవినుత
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 22

కూర్మరూపముఁదాల్చియు కొండమోసి
క్షీర సాగరమును లెస్స చిలుకఁజేసి
అమృతము పంచిపెట్టిన ఆదిపురుష!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 23

ఆదిసూకరమూర్తివై అసురు జంపి
జలధిలో నుండి పుడమిని చక్కనెత్తి
లోకులందర గాచిన లోకనాథ!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 24

మహిత నరసింహుడై స్తంభమందు పుట్టి
హేమ కశిపుని వధియించి ప్రేమ మీర
బాలు ప్రహ్లాదుగాచిన భాను తేజ
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 25

తే॥ వామనావతారము దాల్చి వసుధయందు
పూని మూడడుగుల నేల దానమడిగి
బలికి కీర్తి దానమొసంగి నిలిచితీవు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 26

రాజ్య గర్వాంధమతులైన రాజులపయి
ఇరువదొకమారు దండెత్తి గరువమణచి
దురితమును రూపుమాపిన పరశురామ!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 27

రాముడై పుట్టి కానన భూములందు
సంచరించుచు దనుజుల సంహరించి
వీర నర వరుడైతివి వినుత చరిత!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 28

కృష్ణుడై పుట్టి యాదవ గృహమునందు
రాక్షసాంశతో బుట్టిన రాజతతిని
మట్టుబెట్టి భూభారము మాన్పినావు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 29

బుద్ధుడై చని హేమాదీ పురములందు
దానవుల నీతి బాహ్యులుగా నొనర్చి
త్రిపుర దహనము చేయించితివి గదయ్య
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 30

తే॥ విష్ణుయశునకు పుత్రుడై విభుత నెఱపి
కలినివెస నిగ్రహించి యీ కలియుగమున
కృతయుగంబును నెలకొల్పు హితుడవీవు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 31

బ్రహ్మ నీనాభి కమల సంభవుడు కాగ
అమిత సుజ్ఞానము నొసంగి అతని చేత
సృష్టి చేయించినావు విశిష్ట రీతి
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 32

వెన్నదొంగవు నీవని వినుట వలన
త్రాటితో రోట బంధించి తల్లి చనగ
చెట్ల జంటను కూల్చిన చిద్విలాస!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 33

మహిని కాళియుడుండిన మడుగు సొచ్చి
ఫణిఫణావలిపై నాడి పరవశించి
పాపజీవిని పంపించి బ్రోచినావు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 34

కంసుడనుప నక్రూరుండు కాంచి మ్రొక్కి
వినయమున యజ్ఞవార్తను విన్నవించ
చంపనెంచిన వానిని చంప జనిన
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 35

తే॥ కొండ గొడుగుగా ధరియించి కూర్మితోడ
గోప గోపికా గోగణ తాప ముడిపి
వజ్రి గర్వము బాపిన వాసుదేవ!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 36

కుబ్జ కడ లేపనంబులు కొనిధరించి
వక్రతనువును సరిచేసి వనిత సొగసు
యినుమడింపగఁజేసిన వనజ నాథ!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 37

ఖలుని కంసుని కడతేర్చి కాంక్షదీర
ఉగ్రసేనుని గావించి ఉర్విపతిగ
మధుర పాలింపఁజేసిన మాన్యుడీవు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 38

పడతి మాటని నిర్లక్ష్యపరచకుండ
అగ్రజన్ముని సూచన ననుసరించి
వచ్చినావు విదర్భకు వారిజాక్ష!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 39

పెద్ద పిన్నలనెంచు వివేకమేది?
న్యాయ మన్యాయము నెరింగి నడచుటేది?
బాపురే! మాయలోక మపాయమయము
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 40

తే॥ బాధ గురువులు నుందురు బహువిధముల
బోధ గురువులు అరుదుగా భూమి నుంద్రు
వారిఁ గనుగొని చేరంగ వలయు జనులు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 41

ద్రౌణి అస్త్రానల జ్వాల తాకకుండ
విరటు దౌహిత్రుఁగాచిన విజితవైరి
నీదు మహిమలు వర్ణింప నెవరి తరము?
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 42

భారతాహవ మందున పార్థు కొరకు
గీత ప్రవచించి యాతని గీత మార్చి
విశ్వ గురుడవై వెలసిన వేదవేద్య!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 43

పండితోచితమగు వేదపఠన లేదు
భేరి నీ పాదముల పూజ చేయలేదు
భక్తి మీరంగ నీ కీర్తి పాడలేదు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 44

రామరామా యటంచును వ్రాయలేదు
కోరి కోదండరాముని కొలువలేదు
యెట్లు తరియింపఁజేతువో ఇనకులేశ!
దివ్య భవ్య ప్రకాశః శ్రీ తిరుమలేశ! 45

తే॥ ఎన్ని జన్మము లెత్తిన నేమిఫలము
మనుజ జన్మ దుర్లభమని మదినెఱింగి
నిన్నుఁజేర యత్నింపరు నీచజనులు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 46

నరకు వధియించి మెప్పించి నరసురలను
షోడశ సహస్ర కన్యల చోద్యముగను
పరిణయము చేసికొనిన గోపాలకృష్ణ!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 47

ఆ కుచేలుడు దారిద్ర్య మనుభవించి
భక్తితో నిన్ను దర్శించ వచ్చి కొలువ
పిడికెడటుకుల కీవె సంప్రీతి సిరులు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 48

ధర్మచరులైన పాండు భూధవుని సుతుల
ఆపదల బాపి దుష్టసంహరణఁ జేసి
ధర్మరక్షణ చేసిన దైవ మీవు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 49

అన్నమయ ఆలయద్వారమందు నిలువ
తలపులో నిండి కోవెల తలుపు తెరచి
వేగ దర్శన మిచ్చిన వేంకటేశ!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 50

తే. గరిమ నవవిధ భక్తిమార్గములఁ బూని
నీదు దయకు సత్పాత్రులై మోదమంది
ఎందరో ముక్తులైనారు ఇందిరేశ!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 51

వేంగమాంబాదు లిల హృదయంగమముగ
నీదు రూపునే చింతించి నెమ్మనమున
నిన్ను కనులారఁగాంచిరి నీరజాక్ష
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 52

నిష్ఠతోడ ఖట్వాంగ భూనేత తొల్లి
రెండు ఘడియలలోనె తరించె మిహిని
పట్టుదలె మంచిచెడులకు ప్రాపుకాదె?
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 53

గురువు తెల్పిన బోధయే గురుతరంబు
గురువు లేకున్న మార్గంబు కుదురదండ్రు
నాకు గురుడవై ముందుకు నడుపుమయ్య
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 54

పాపకర్మలు చేయుట పాడిగాదు
పుణ్యకర్మలు చేయుట భువిని మేలు
మంచి చెడులు విచారించి మనగవలయు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 55

తే॥ సాధు దర్శన మత్యంత సత్ఫలదము
స్పర్శనముచేత పాపంబు సమయునండ్రు
మాటలాడిన మోవును మాంద్యమండ్రు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 56

గోపకాంతలు నీటిలో గ్రుంకు లిడుచు
తన్మయావస్థిలో నుండ దరికిఁ జేరి
వారి వలువలు దోచిన వారిజాక్ష!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 57

పోరునష్టంబు లాభంబు పొందువలన
పరుల మంచియు తమ చెడునెరిగి కొనుచు
ఒకటిగా నుండవలయును ఉర్వీజనులు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 58

చదువులను నేర్చి సన్మార్గచరుడుగాక
అవగుణుండై చరించెడు అతనికన్న
చదువు వాసన లేనట్టి చవట మేలు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 59

సారహీన దుస్సంసార జలధియందు
చిక్కుకొని దరిఁజేరెడు చేవలేక
శరణుఁజొచ్చితి నీపాద జలజములను
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 60

తే॥ కోపతాపాలతో సదా కుంది మదిని
శాంతి సౌఖ్య విహీనులై భ్రాంతులగుచు
మనెడు మాకెట్లు నినుఁజూచు మార్గ మబ్బు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 61

దానధర్మాలు చేసెడు తలపులేక
తాను తినుకొక్కె సయితమింతయును లేక
చేర్చి పెట్టెడు లోభులు చెడుదు రవని
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 62

కోటితీర్థములందున గ్రుంకులిడిన
దేవళంబులు పెక్కులు తిరిగి కనిన
భక్తి లేనిచో దొరకదు ముక్తి భువిని
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 63

దీనజనులను గాపాడు దేవుడవని
నిరుపమములైన నీ పాద నీరజముల
నాదు హృదయాన నిల్పెద మోదమలర
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 64

శ్రీ మనోహర! పరమేశ! శ్రీనివాస!
వేంకటేశ! పరాత్పర! విష్ణుమూర్తి!
సచ్చిదానంద! రఘుకుల సార్వభౌమ!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 65

తే॥ ఆదిశేషుడైనను కొనియాడలేని
నిన్ను విమతించ నేనెంత నీరజాక్ష!
స్మరణయే నుతిగానెంచి సరగఁబ్రోవు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ!

కొంచెమైనను కొండగా నెంచువాడ
అల్పమగు నాదు కైంకర్య మాదరించి
అభయమొసగి రక్షించుమో అప్రమేయ
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 67

పాండురంగ! పరాత్పర! పాపనాశ!
జలజనాభ! జగద్గురు! జగదధీశ!
జానకీ వల్లభా! యని సతము దలతు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 68

చాలకాలము జీవింపఁజాలుదుమని
తమదియే వైభవంబని దర్పమొసగ
పరుల బాధించు కుజనుల బ్రతుకదేల?
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 69

అష్టమదపీడతో గతి అరయలేక
అరుగురు శత్రువుల నోర్చి అణచలేక
దిక్కు తెలియక విలపింతు దీనబంధు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 70

తే॥ శ్రీధవ! ముకుంద! గోవింద! శ్రీనివాస!
మాధవా! కేశవా! నీదు మహిమ తెలియ
నేరకీరీతి నుంటిని నీరజాక్ష!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 71

శ్రీధరా! మురళీధరా! చిద్విలాస!
పన్నగాంతక వాహనా! భక్తపోష!
కరుణతో వేగ ననుఁ గావ కదలిరమ్ము
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 72

నరకు వధియించుటెరిగి నీదరికి రాక
భయపడిన భగదత్తుని భయముఁ బాపి
దైత్య రాజ్యము నొసగిన దానవారి!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 73

ముందు భూదేవి ప్రార్థింప ముదమునంది
రాక్షసావళి దెగటార్చి రణములోన
భూమి భార మడంచిన భూరితేజ!
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 74

గర్భ నరకములో బడిగాసిఁ జెంది
బయట పడినను మాయలోఁ బడుచు మరల
జన్మకూపములోనికేఁ జనఁ దలంతు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 75

తే॥ బాల్య మయ్యది క్షణములో బాసిపోయె
నడిమివయసు గర్వంబున గడిచిపోయె
ముదిమి చింతాకులంబయ్యె ముక్తి యేది
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 76

తల్లిదండ్రుల పోషణ తరచు విడచి
పత్ని శిశువుల కాపాడు బాధ్యతయని
నీతి బాహ్యుడనైతి మన్నించుమయ్య
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 77

నీరికి చెప్పక, చక్రము చేత గొనక
యేకతంబుగ కరినేల నేగితివట
ఆశ్రితులఁగావ కలరె నీయట్టివారు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 78

ఇంద్రియంబులచేఁజిక్కి యిహపరములు
పాప పుణ్యాలెరుంగక భ్రమసి పొగులు
జడుని ననుఁగావఁగలిగిన స్వామి నీవె
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 79

కులము నందున హెచ్చు తక్కువలుఁ గలవే?
గుణముఁగలవాడు మహిలోన గొప్పవాడు
అవగుణుండెందుఁ బుట్టిన అధముడగును
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 80

తే॥ దారు పాషాణమూర్తుల ధరనుఁబెట్టి
పూజ చేయుచు నుందురు పుడమి జనులు
ఆత్మ సంస్థితుడైన నిన్నరయ లేక
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 81

జపము చేయుచునుందురు జగతిజనులు
మనసు పరిపరి విధముల మసలుచుండు
మనసు నిలబెట్టుటే గొప్ప మహిని గూడ
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 82

పేదసాదల చూడరు ప్రీతిగాను
ధనికులను గౌరవింతురు ధరణియందు
ఇట్టి లోకులలో మార్పులెపుడు వచ్చు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 83

కోపమునకన్న మరియొక ఘోర వైరి
శాంతమున కంటె మించిన సఖులు లేరు
దయను మించిన చుట్ట మీ ధాత్రిలేదు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 84

కోట్లకోలది జన్మములలోన కొంత కొంత
పుణ్యకర్మను చేసిన పుడమి జనుడు
మంచి సంస్కారముఁ బొంది మాన్యుడగును
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తితుమలేశ! 85

తే॥ నియత తపమును ఇంద్రియ నిగ్రహంబు
భూరి విద్యయు సద్గతి బొరయ జేయు
దుర్గతికి హేతువగు ధర్మద్రోహ చింత
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 86

కీర్తిమంతుల కడు గొప్ప కీర్తినైన
చెఱచు నలుసంత లోభంబు చేరెనేని
ఒడలి సొగసుఁ బాపెడు తెల్లపొడ విధమున
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 87

పాపసాగరమును దాట భక్తియనెడు
నావచే తప్ప వేరొంట నలవిగాదు
అట్టి సద్భక్తి నొసగి నన్నాదరించు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 88

ఆకలికి బాధపడు వానికన్నమొసగి
దప్పిగల వానికిసుమంత దాహమిచ్చి
ఆదరించిన వాడెపో అవని ఘనుడు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 89

సర్వదుష్టులలో మేలు సర్పమవని
బాధ కలిగిన నెప్పుడో పాము గరచు
కాటు వేయును దుష్టుడేకాలమునను
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 90

తే॥ అవనియందున వాక్శౌర్యమధికమయ్యె
కార్యశూరత పరికింప కరవు పడియె
బ్రతుకు లాడంబరాలతో భారమయ్యె
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 91

ఎవడు పరధన, కాంతల తవిలిచనడొ
ఎవడు సత్యము వీడక భువిఁజరించు
వాడె ధర్మము తప్పని వాడు భువిని
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 92

శత్రు సోదరునికి నాడు శరణ మొసగి
అగ్రజుని రాజ్యము నొసంగి ఆదరించి
పట్టమునుఁగట్టి లక్ష్మణుఁబంపినావు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 93

సాధన చతుష్టయాన్విత సౌమ్యులగుచు
హితము గావించు సాధు సన్మతులు బుధలు
వారి గుర్తించిఁ జేరంగవలయు నరులు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 95

శమదమాది షట్కంబును సరగ నేరిగి
మోక్షమార్గాన పయనించ ముక్తి గలుగు
అదియెపో ముముక్షుత్వము అరయగాను
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 94

తే॥ దేహములు లక్షలాదిగా దెలియుచుండు
అన్ని దేహములందుండు ఆత్మయొకటె
ఉదక పాత్రల రవి బింబముండునట్లు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 96

శాంతి గలవానికెప్పుడు సౌఖ్యముండు
కోపికుండును కష్టాలు కొలదిగాక
కోపమే పాపమందురు కువలయమున
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 97

కష్టపడువాని కెచటైన కలుగు ఫలము
సోమరికి నేడనున్నను సుఖములేదు
తపము చేసిన వారికి తాపముడుగ
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 98

పుణ్యకర్మలు చేయంగ పుడమి నరుడు
పెద్ద కార్యంబులేవియు చేయకుండు
చేతలకు దగు భాగ్యంబు చేకుచుండు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 99

జ్ఞానజ్యోతిని వెలిగించు జ్ఞాని చూడ
గురువరుం డాత డగునుపో కువలయమున
వారి సేవలు చేయంగ వాంఛదీరు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 100

తే. స్వర్ణకారుడు మలినమౌ స్వర్ణమునిల
ద్రావకము వేయ మలినము దరిగి పోయి
శుద్ధ కాంచనమగు నది క్షోణియందు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 101

గొప్ప గురువుల యోగుల కోరి వారి
సేవలను చేయ మోక్షంబు చెందగలరు
అట్టి గురువులు దొరుకుట అరుదు భువిని
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 102

మంచి గురువుల యుపదేశ మహిమ వలన
అంధకారము నశియించు నదియుముక్తి
పావనుండగు నాతడు పరముచేరు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 103

దేహమే దేవళంబని దెలియబరచి
జీవుడే దేవుడనుచు వచించుచుంత
పరమ మూర్ఖులెరుగలేరు వసుధయందు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 104

ముదిసె దంత కేశంబులు ముదిసెతనువు
ముదియదాయె సంతతిమీది మోహమిపుడు
ముదియదాయె జీవేచ్ఛ ఏమోక్షమబ్బు
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 105

తే॥ అశ్వమేధ సహస్రంబు లవనియందు
సత్యమున కొక్క దానికి సమముగావు
సత్యముండును పరికింప శాశ్వతమున
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 106

కాలమహిమల నెన్న శక్యంబె ధరణి
తల్లిఁ దండ్రుల కన్న మింతయునుఁ గనరు
భార్య కోరిన వి త్తురు బహువిధముల
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 107

తనయుఁడధి కారముంజూపు తండ్రిమీద
భర్త భార్యకు భయపడి బ్రతుకు జగతి
కలి ప్రభావము కడు వింతగాదెఁ జూడ
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 108

ఆది మధ్యాంత రహితుని అరయలేక
కొత్త కొత్త దేవతలను కొలుతు రవని
ఎచ్చుతగ్గులు తెలియక ముచ్చటపడి
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 109

విద్యలందున అధ్యాత్మ విద్య ఘనము
దానములయందు గొప్ప నిదానమరయ
ధర్మములయం దహింస ప్రధానమగును
దివ్య భవ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 110

తే॥ తిరుమలేశుని శతకము తీరుగాను
చదివినను విన్న సర్వులు శాంతి బొంద
నిత్య కళ్యాణ మొసగుము నీరజాక్ష!
దివ్య శివ్య ప్రకాశ! శ్రీ తిరుమలేశ! 116

